## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# గౌతమ

(Goutama The Buddha)

రచన:

పి. వి. సుబ్బారావు, బి. ఏ., బి. యల్.

ప్రగతి ప్రచురణ, తెనాలి

వెల : 0–12–0

# "అంజలి"

పూజ్యపాదులు, మహాజ్ఞాని, తత్వనిధి, మేధా సంప న్నులు, స్థిత ప్రజ్ఞులు, సత్యస్వరూపులు, అజ్ఞానతిమి రాంధకార బంధుర మానవ కోటికి స్వచ్ఛందతార, అస్మదాదులకు హితులు, సన్నిహితులు, ప్రాణ తుల్యులు అయిన గురుదేవులు మహా మహితాత్ములు

## శ్రీ మానవేంద్ర నాథ రాయ్ గారికి

శ్రీ వారి మహా ప్రస్థానం :

1954 జనవరి 25, 26 తేదీలమధ్య రాత్రిసమయము

# నీడ – వెలుగు

"మానవుణ్ణి మానవుడుగా చూడలేక అర్థంచేసుకో లేక, మాలిన్యంతో యీర్ష్యాజుగుప్సలతో, అసూయా అసహనాలతో మంచిని మంచిగా చూడలేక, ఓర్వలేక, మంచిని చెడుగా, చెడుని మంచిగా, వూహించుకొని, చిత్రించుకొని, దురాశా పరులై ద్వేష భావంతో, "వికట దంష్ట్రా భయంకర వికృత విషమహాసుల" వోలె, తామువినా యితరులందరు నీతి బాహ్యులని, కారుణ్య రహితులని, హింసాపరులని, అసత్య వాదులని, పాప పంకిలులని, దయారహితులని, తాము చెప్పేది నీతి శాసనమని, తాముచేసేది ధర్మకాండ అని, తాము వూహించేది మానవ కల్యాణమని, 'తాము' అంటేనే త్యాగానికి మారుపేరని, తామే నీతి దాయకమైన సంఘానికి స్రష్టలమని, వైతాళికులమని, మార్గగాములమని. తమవంటి వుత్తములు లేకున్న సంఘమే అజ్ఞానాంధకార బంధురమై నీతి బాహ్యమై ఛిన్నా భిన్నమై, అండపిండ వేదోండ బ్రహ్మాండ మంతా వందలాది వేలాది తుంపులై, తునాతునకలై, పీనుగ పెంటఅయ్యేడిది అని విర్రవీగుతూ కార్పణంతో కండ్లు మూతలుపడి, కుళ్ళి లుకలుకలాడే మానవ కోటికి కనువిప్పు యీ మహా నాటకం."

కపిల వస్తు నగరంలో శుద్ధోదన చక్రవర్తి తన కుమారుడు గౌతమ సిద్ధార్థునికి నిర్మించిన మూడు భవనాల్లో ఒకటి దూరంగా కనిపిస్తూ వుంటుంది. సిద్ధార్థుని పత్ని యశోధర విహరిస్తున్న ప్రాంతానికి అనతి దూరంగా మంచినీటి కొలను ఒకటి కనిపిస్తూం టుంది. యశోధర విహరిస్తున్న ఉద్యానవనం మాలతీమందారములు, మంకెన కేదారములు, మల్లెలు, సన్నజాజులు, సంపెంగలు,గులాబులు ఆదిగాగల సమస్త పుష్పరాజములతో వెల్లి విరిసి, వికసించి, శోభాయమానంగా, నవనవోన్మేషితంగా, నిండుగా పండిన మాతృశ్రీ ఉదరంలా వుంది.

యశోధర తీరిక లేకుండా, ఎక్కడైన చెరురాటుగా ఎండి పోయిగాని వాడిపోయి గాని వున్న ఆకుల్ని, పుష్పాల్ని పూల మొక్కల నుంచి ఏరి, గిల్లి బుట్టలో వేస్తుంటుంది. సిద్ధార్థుడు వెనుక నుంచీ వచ్చి యశోధర కుడిభుజం పైనించీ ముఖం పోనిచ్చి దీర్ఘ నిశ్వాసం విడుస్తాడు. యశోధర ఎడమ భుజం రంగస్థలం వైపుకి వుంటుంది. యశోధర తత్తర పాటుగా చేతిలోని బుట్టను దాయ టానికి ప్రయత్నిస్తుంది. సిద్ధార్థుడు, సుదీర్ఘంగా నిశ్వాసం విడుస్తూ ప్రక్కనే వున్న చలువ రాతి బల్లమీద ఆసీనుడౌతాడు. బాసీ పెట్టు వేసుకొని గడ్డం క్రింద రెండు చేతులు వుంచుకొని జేవురించిన ముఖం పెట్టు కుంటాడు.

యశో:- ప్రభూ ఉద్యానవనం ఎంత శోభాయమానంగావుంది.

సిద్ధా:- అవును.

యశో:- ఆవికసించిన పుష్పాలతో,నవనవోన్మేషితంగా కళకళ లాడే ఈ వనం మీ మహత్తర ప్రేమ భావనకు అర్థా రాలనన్న ఉత్సాహాన్ని నాలో ఉద్దేపింప జేస్తుంది ప్రభూ !

సిద్ధా:- (కరుణార్ద్రమైన చూపులతో) యశో! సందేహమా!
నీ ప్రేమ సామ్రాజ్యాన్ని ఆక్రమించిన మీదటే గదా
నాకీ శాక్య సామ్రాజ్యాధిపత్యంపై రుచి తప్పింది.

యశో:- (ఆర్ద్రోక్తిలో) ఆహా! ధన్యురాలను ప్రభూ!

సిద్ధా:- కాని.....

యశో:- స్వామీ సందేహిస్తున్నారేమి చెప్పండి కాని.....
(సిద్ధార్థుడు ముఖం ప్రక్కకు త్రిప్పి వుంటాడు)

యశో:- (తొట్రుపాటుతో) ప్రభూ! మీ పట్ల నేను ఎట్లాంటి
అపచారమూ చెయ్యలేదే. స్వప్నావస్థలో సైతం
నేను మీ ప్రణయదాసి గానే వుంటున్నానని
మొన్ననే గదా మీరు అన్నారు. నా ఉపచరణా
కార్య క్రమంలో లోట్లువున్న సవరించుకో గలను
ప్రభూ!

సిద్ధా:- యశో! ఎందుకంత కలవరపాటు. నీవు కాదా నాకు
సౌందర్యోపాసనకు, ఆనంద రసాస్వాదనకు ఉపాధివై
సుందరత్వం, ముగ్ధమోహనత్వం అంటే ఏమిటో రుచి
చూపించింది. మానవుల ఊహల కందని నీ స్వప్న
సౌందర్యం, కాదా నాకు జీవితము మధురము, ఆనంద
దాయకము అన్న భావాన్ని స్ఫురింప జేసింది. శాక్య
రాజ్య సింహాసనం సైతం నాలో కదలిక కలిగించ
లేని పరిస్థితుల్లో నీ అనంత సౌందర్యం కాదా నన్ను
పిపాసాప్రపూరితుడైన ఉపాసకునిగా చేసింది. కాని...

యశో:- (ఉద్వేగంతో) ఉఁ! ...... కాని ...... ప్రభూ!

సిద్ధా:- కాని ...... ఏమీలేదు (క్షణమాగి) అవును గాని యశో! సత్యా సత్యములు, పాప పుణ్యములు, సుఖ దుఃఖములు వీటి తాత్పర్యం ఏమిటో, మానవ జీవిత పరమావధి యేమో, ఎప్పుడైనా ఆలోచించావా, పొరపాటు. నీ పసిహృదయానికి సంక్షోభం కలిగించ లేను.

యశో:- చలనమే ఆగిపోయి పరచిన చలువ రాతిని మర పిస్తుందా అన్నట్లుండే ఆ కొలను అప్పుడప్పుడు రాలి పడే పుష్పాలకు కదలినట్లు మీ మనస్సు కూడా ఏవేవో భావ పరంపరలతో వూగి పోతున్నట్లుంది ప్రభూ! నాలుగైదు దినాల నుంచి నేనీ మార్పును గమనించక పోలేదు. స్వామీ! అంతఃపుర వాతా వరణంలో మీ మనస్సును కలవర పరచే పరిస్థితులు ఏవీ లేవు గదా?

సిద్ధా:- అవును గాని రాలిపడే పుష్పాలు అన్నావు. రాలి పడడం అంటే ఏమిటి యశో? ఎన్నడూ వినని మాట విన్నాను.

యశో:- (తత్తరపోయి అంతలో తన్ను తాను సంబాళించుకొని ప్రక్కనే వున్న రాలి పడిన పుష్పాల బుట్టను చాటుకు నెడుతుంది)

సిద్ధా:- పుష్పాలు సువాసన లిస్తాయనే నాకు తెలుసు. రాలి పడతాయా? అంటే?

యశో:- (రాలిన పూల బుట్టను మరీ చాటుకు నెడుతుంది)

సిద్ధా:- యశో! (ముందుకు పోయి దాచిన పూల బుట్టను బైటకు తీస్తాడు) యీ పూలు చూశావా, నా వంక ఎలా

చూస్తున్నాయో ! నాన్నగారు నావంక ఎప్పుడూ యిలాంటి చూపులే చూస్తారు. ఆవాడిన చూపుల్లోని నిగూఢ రహస్యాలు నన్ను ఎంతగా బాధిస్తాయో చెప్ప శక్యం గాదు యశో!

యశో:- మామగారికి మీరంటే అత్యంత ప్రేమ. మీరు మహా చక్రవర్తు లవుతారని, విశ్వజనీనంగా ఆదరణాభిమానములు పొందుతారని, రాచకార్యభారాన్నుంచివారికి విశ్రాంతి కలిగిస్తారని కొండంతగా ఆశలు పెట్టుకున్నారు ప్రభూ! తండ్రి గారి మనో సంకల్పం నెరవేర్చటం పుత్రుని ప్రథమ కర్తవ్యం గదా !

సిద్ధా:- (చిరునవ్వుతో)నాకు కర్తవ్యం చెబుతున్నావా! యశో!

యశో:- (సంబాళించుకొని) ప్రభూ! మీకు కర్తవ్యాన్ని బోధించ గలిగినంత సమర్థురాలనా నేను. హృదయంలోని ఆరాటం అలా అనిపించిందే గాని......... యీ పొరపాటుకు క్షంతవ్యురాలను ప్రభూ !

సిద్ధా:- యశో! మానవులు నిజంగా కర్తవ్యాలు తెలుసుకొనే నడుస్తున్నారా అని నా సందేహం. మానవ జీవిత పరమావధి ఏమిటి? మనం ఎందుకు పుడుతున్నాం? ఎందుకు బ్రతుకు తున్నాం? బ్రతుకు తెరలచాటున దాగిన అనంతసత్యం ఏమిటి? అసలు అట్లాంటి సత్యమంటూ ఒకటి వుందా? ఇట్లాంటి సమస్యలతో నాతల బ్రద్దలవుతోంది. యశో !

యశో:- యీ పూట మీ రేదో వింతగా మాట్లాడు తున్నారు. నాకేదో బెంగగా వున్నది ప్రభూ !

సిద్ధా:- (తెచ్చి పెట్టుకొన్న చిరునగవుతో) నీ లేత హృదయాన్ని అంతులేని, ముగియబోని, యీసమస్యలతో చికాకు పరచను గాని, యశో ఏదో అన్నావు, మళ్ళీ చెప్పు రాలి పడడం అంటే ఏమిటి ?

యశో:- ఏదో తెలియక అన్నాను ప్రభూ నేను మాట్లాడే మాటలకు అర్థం అప్పుడప్పుడు నాకే తెలియకుండా పోతూంది. (జాలిగా చూస్తుంది)

సిద్ధా:- యశో! అబద్ధమాడుతున్నావు. అబద్ధం మానవ జాతి అభ్యుదయానికే ప్రతిబంధకం. మానవశోభకు, మనోవికాసానికి అబద్ధం ఒక మహా కళంకం సుమా. నీ వంటి సౌందర్యరాసి, స్నిగ్ధ హృదయిని అసత్యాలు పలుకుతుంటే వినలేను. సత్యం, శివం, సుందరం; అని గదా లోకోక్తి. సత్యం అంతఃకరణకే గాక బాహ్య సౌందర్యానికి గూడా వన్నెలు తెస్తుంది. (ఇంతలో నీలిమ అను యశోధర అనుంగు దాసి వస్తుంది. ఏకాంత వాసంలో వున్న సతీ పతులను చూచి ఒక్కడుగు వెనక్కు వేస్తుంది. సిద్ధార్థుడు యిది గమనిస్తాడు)

సిద్ధా:- నీలిమా! ఏమి విశేషం ?

నీలిమ:- దేవిగారు పూజా మందిరంలో వున్నారని అటు వెళ్ళాను అటునుంచి......

యశో:- అవును నీలిమా ఈ వేళ దేవీ పూజకు ఆలశ్య మయింది పద. ప్రభూ అనుజ్ఞయా!

సిద్ధా:- ఆఁ అవును గాని నీలిమా, నీవైనా చెప్పు. రాలి పడడం అంటే ఏమిటి? పుష్పాలు రాలిపడతాయా ?

నీలిమ:– ప్రభూ! మహారాజులుం గారి ఆజ్ఞలు తమకు అట్లాంటి పదాలు వినపడ కూడదని (యశోధర తత్తర పడుతుంది. నీలిమ వెంటనే సంబాళించు కొని) కాదు. అవును, ప్రభూ కాదు. అవును. నేనెప్పుడు అట్లాంటి పదం విన లేదే. మాతల్లి చమవుకో మని ఎంత చెప్పినా చిన్నప్పుడు ఆమె మాటే వినేదాన్ని కాదు. నన్నా! ప్రభువులు అర్థాలు తాత్పర్యాలు అడుగు తున్నారు.

సిద్ధా:– నీలిమా, నీవు బహు జాణవు. అవును గాని మహా రాజులు యింకా ఏమేమి ఆజ్ఞాపించారో చెప్పు.

నీలిమ:– అబ్బే. యింకేమీ లేదండి. అసలు మహారాజులుం గారు ఆజ్ఞాపించందే. వారు ఆజ్ఞాపించటం విరమించి చాలా కాలమైంది. ప్రభూ! మహారాజులుం గారికి ఎప్పుడు తమను గురించే ఆలోచన.

సిద్ధా:– (కించిత్తు కటువుగా) నీలిమా! మీ దేవిగారిని అబద్ధాల బడిలో చదవేస్తున్నది నీవేనన్న మాట. అవునా! ఎందుకు మీరంతా యిన్నేసి అబద్ధాలు ఆడు తుంటారు. మీరీ అబద్ధాలన్నిటితో అల్లే కుట్ర ఎవరి మీద నీలిమా? నా మీదనే గదా.

నీలిమ:–
యశో:– } ప్రభూ! మీమీద కుట్రా! ఎంతమాట క్షమించండి.

సిద్ధా:– నీలిమా! దినదినమూ మీ అందరూ ప్రతి స్వల్ప విషయంలోనూ "క్షమించండి, క్షమించండి" అని దీనాతి దీనంగా ఎందుకు వేడుకుంటున్నారో నాకు యిప్పు డిప్పుడే అర్థమవుతుంది. మిమ్మల్ని క్షమించే శక్తి గూడా నాలోసన్నగిలి పోతూంది. నీలిమా!

ఇప్పుడైనా చెప్పేదవా మహారాజులు యింకా ఎట్లాంటి ఆజ్ఞలు జారీ చేశారో లేక నన్ను కూడా కన్నెర్ర జేసుకొని అలవాటు లేని అలవాటుతో ఆజ్ఞాపించ మంటారా ?

నీలిమ:– (తొట్రుపాటుతో) ప్రభూ! ఎన్నడూ చూడని కోపపు నీడలు ప్రశాంత, మైనదివ్యవంతమైన తమమూర్తిపై యీనాడు క్షణమాత్రంగా యిటునుంచీ అటు కదలి పోవడం చూస్తుంటే నాకు చాలా భయంగా వుంది ప్రభూ! క్షమించండి, యీ దీనదాసురాలిని.

సిద్ధా:– ఇంతకూ మహారాజులుం గారి ఆజ్ఞ లేమిటో చెప్పనే లేదు. నీలిమా ఏమి చాతుర్యమే నీది.

నీలిమ:– ఏముంది ప్రభూ! శుద్ధోదన మహారాజులుం గారు తమకు మృత్యువు, బాధ, ఋగ్మత, శోకము, ఆకలి, వృద్ధాప్యం యిట్లాంటి పదాలు గాని యీ భావనలు ప్రకోపం చేసే దృశ్యాలు గాని, వినపడ కుండా, కన పడకుండా, చేయమని ఆజ్ఞలు జారీ చేశారు ప్రభూ! (తొట్రుపాటుతో యశోధర వంక ఒకసారి సిద్ధార్థుని వైపు మరొక సారి చూస్తూ) కాదు ప్రభూ. అంతా అబద్ధం నేను చెప్పేదంతా అబద్ధం. నన్ను నమ్మండి నేను యిప్పుడు చెప్పిందంతా అబద్ధం. సర్వా బద్ధం. నా మాట నమ్మరూ. నేను ఎప్పుడూ అబద్ధాలు చెప్పనని మీకు తెలియదూ. నన్ను నమ్మండి ప్రభూ! అన్నీ అబద్ధాలు చెప్పాను. మహారాజులుం గారికి యిది తెలిస్తే...... తెలిస్తే.........
నన్ను నమ్మండి ప్రభూ! యిదంతా అబద్ధం.

సిద్ధా:- అవును నీలిమా! నీవు చెప్పింది యదార్థమే. నీవు అబద్ధాలు ఎప్పుడూ చెప్పవు. మీకు, మహారాజులకు అందరికీ నాపై యింత నిర్దయ దేనికో ?

యశో:- ప్రభూ! ఎంతటి మాట! మామ గారికి మీ మీద నిర్దయా? వారి సర్వస్వం మీరేగదా. కంటికి రెప్పగా మిమ్ము చూచుకొంటూ మీ మీదనే తమ సర్వాశయాలు, కోర్కెలు పెట్టుకొని బ్రతుకు తున్నారు, ప్రభూ! మాయాదేవి గారు తమ్ము లోకానికి ప్రసాదించిన ఏడవ రోజుననేగదా కాల ధర్మం చేసింది. ఆనాటి నుంచీ మామగారే మీకు తల్లి, తండ్రి సర్వస్వంగా ప్రేమించి పెద్దవారిని చేసింది. కొండంత ఆశలు మీమీద పెట్టుకొనే గదా వారు మాయాదేవి నిర్యాణ విచార భారాన్ని కూడ దిగమ్రింగు కొని వస్తున్నారు. ప్రభూ!

సిద్ధా:- అవును యశో! పాపం నాన్న గారిని చూస్తే నాకు ఎంతో బాధగా వుంటుంది.

నీలిమ:- దేవీ! పూజా మందిరానికి వెళ్ళే సమయం మిగిలి పోతూంది.

యశో:- ప్రభూ! అనుజ్ఞ (సిద్ధార్థునికి నమస్కారం చేసి రాలిన పూల బుట్టను ప్రక్క ప్రక్కగా పెట్టుకొని పూజా ప్రసూనాలను నీలిమకుఅందించి, నీలిమ ముందు నడుస్తుండగా వెనుక బరువైన అడుగులు వేస్తూ యశోధర నిష్క్రమిస్తూంది. అటు యశోధర నిష్క్రమిస్తూ వుండగానే యిటు రంగస్థలంపైకి రథచోదకుడు చెన్నుడు ప్రవేశిస్తాడు. బాగా వొడ్డు పొడుగూ

నలుబది సంవత్సరాలపై బడ్డ వయస్సు. యింత పెద్ద తల పాగ కిర్రు చెప్పులు యింతేసి మీసాలు నిండు విగ్రహం చెన్నుడు. చెన్నుడు ప్రవేశించిందే గమనించడు సిద్ధార్థుడు. బాసీ పెట్టు పెట్టుకొని దీర్ఘంగా ఆలోచిస్తూ శూన్య దృక్కులతో చూస్తూ వుంటాడు సిద్ధార్థుడు. చెన్నుడు దగ్గి, సకిలించి, చప్పుడు చేస్తాడు సిద్ధార్థుడు అప్పటికే దీర్ఘ ఆలోచనా సమాధిలో వుంటాడు)

చెన్ను:- ప్రభూ! ఆజ్ఞ.....ప్రభూ!

సిద్ధా:- (యోగనిద్ర నుంచీ మేల్కొన్నట్లుగా కనిపిస్తాడు.) చెన్నా, నీవా! అవును గాని ఒక్క సందేహం తీర్చ గలవా ?

చెన్ను:- సందేహమా! ఒక్కటేమిటి ప్రభూ! సందేహాలయితే తమకు పుంఖాను పుంఖాలుగా కలుగుతుంటాయి గాని నేనా తీర్చగలిగింది, నాకేమి తెలుసునని ప్రభూ!

సిద్ధా:- చెన్నా అవహేళన చేస్తున్నావా నన్ను.

చెన్ను:- ప్రభూ ? అపరాధిని క్షమించండి. నేను మిమ్మల్ని ఎగతాళి చేస్తున్నానా? మీరంటే నాకు పంచ ప్రాణాలే మీ కొరకు నా సర్వస్వాన్ని తృణ ప్రాయంగా వొడ్డుతానే, అట్టినన్నా మీరీ విధంగా శిక్షిస్తున్నది.

సిద్ధా:- దిగులు పడకు చెన్నా. నిన్ను నేనెరుగనా, అవును గాని నా సందేహం తీర్చెదవా మరి.

చెన్ను:- సందేహమా ! ఏమని ప్రభూ!

సిద్ధా:- మహారాజులుంగారి ఆజ్ఞలను గురించి !

చెన్ను:- మహారాజులుం గారి ఆజ్ఞలా? ఏమని ప్రభూ!

సిద్ధా:- ఏమనా! మీ అందరినీ అబద్ధాలు ఆడమని, సత్యాన్ని, సత్యస్వరూపాన్ని నానుంచీ శాశ్వతంగా మరుగు పరచమని.

చెన్న:- ప్రభూ! మీరేనా యీ మాటలు అంటున్నది. మీ చిన్న తనాన్నుంచీ కంటికి రెప్పగా మిమ్ముల్ని కాచుకొని వుంటూ మీ కొరకు ప్రాణాల్ని, ప్రపంచాన్ని, దేన్ని లక్ష్యం చెయ్యని యీ చెన్నుణ్ణా తమరీ మాటలు అంటున్నది. ప్రభూ! ఆజ్ఞాపించండి యీ చెన్నుడు మూడు క్షణాల్లో గొంతుకు వురి పోసుకొని మరీ ప్రాణాలర్పిస్తాడు (క్షణమాగి) ప్రభూ! వురి పోసుకుంటే ఎక్కువ సేపు గిజ గిజ తన్నుకో వలసి వుంటుందే, మరి సముద్రంలో పడి ప్రాణా లర్పిస్తే... అమ్మో పెద్ద పెద్ద కప్ప లుంటాయి. నాకు కప్పలంటే చిన్నప్పటినించీ చాలా భయం .........పోనీ అగ్ని దేవునికి ఆహుతి అయితే...... అది మాత్రం సాధ్యమా! మీసాలు కాలిపోవు. నామీసాలంటే నాకు పంచప్రాణాలు ప్రభూ! (క్షణ మాగి) ఆఁ దొరికింది ప్రభూ! మంచి మార్గం దొరికింది.

(చెన్నుడు బాసీపెట్టు వేసుకొని ముక్కు మూసుకొని కళ్ళు, నోరు మూసుకొని చెవులు గూడా మూసుకుంటానికి వ్యర్థ ప్రయత్నం చేస్తుంటారు.)

సిద్ధా:- చెన్నా ఏమిటి యిదిఅంతా (చెన్నుడు మాట్లాడడు) (తిరిగి) చెన్నా వినపడడం లేదా?

చెన్న:- ఆగండి ప్రభూ! నవరంధ్రాలు బిగపట్టి ప్రాణత్యాగం చేస్తాను, మీ కొరకు. (ముక్కు, చెవులు మూసుకుంటానికి తిరిగి వ్యర్థ ప్రయత్నం చేస్తాడు.)

సిద్ధా:- (చిరునవ్వు నవ్వి) అవును గాని చెన్నా! ముందు రథాన్ని సిద్ధం చెయ్యి; నేను యిప్పుడే వస్తాను.

చెన్న:- ప్రభూ! రథం శుద్ధోదన చక్రవర్తులుం గారు తమ ఆజ్ఞ లేనిదే.........

సిద్ధా:- [ఆర్ద్రోక్తిలో]మారుమాటాడక రథంసిద్ధంచెయ్యి? చెన్నా!

చెన్న:- చిత్తం, ప్రభూ! చిత్తం.

[చెన్నుడు నెమ్మది నెమ్మదిగా నిష్క్రమిస్తాడు. సిద్ధార్థుడు తదేక ధ్యానంతో చూస్తూ గడ్డం క్రింద చేతులు పెట్టుకొని కూర్చుంటాడు. తెర నెమ్మదిగా పడుతుంది.]

# రెండవ రంగం

కపిలవస్తు నగర వీధులు జనసముదాయంతో సందడి సందడిగా వుంటాయి. సమయం సంధ్యా సమయం. సిద్ధార్థుని రథం పురవీధుల్లో నెమ్మదిగా సాగి పోతూంటుంది. రథ చోదకుడు చెన్నుడు త్వర త్వరగా రథాన్ని సాగి పోనివ్వ ప్రయత్నిస్తూ సిద్ధార్థుని ఆజ్ఞలకు జంకి అయిష్టంగా నెమ్మదిగా నడుపుతూ నిరుత్సాహంగా కనుపిస్తాడు. సిద్ధార్థుడు వీధుల్లోని చిత్ర విచిత్రాలు ఎడ తెరిపి లేకుండా పరికిస్తూ వుంటాడు. సిద్ధార్థుడు వ్యాపారస్థుని దుస్తుల్లో ఉంటాడు.

చెన్ను:- ప్రభూ! మీకీ ప్రచ్ఛన్న వేషం బాగా సరిపోయింది సుమా?

సిద్ధా:- అవును చెన్నా! అట్లేతోస్తున్నది. నన్ను తుదకు యీ రాజ భటులు సైతం గుర్తించటం లేదు.

చెన్ను:- ప్రభూ! (జంకుతాడు)

సిద్ధా:- చెప్పు చెన్నా!

చెన్ను:- ప్రభూ! ఇప్పటికే ప్రొద్దు గూకుతూ వుంది, దేవర వారు గృహోన్ముఖులవటం మంచిది.

సిద్ధా:- చెన్నా! ఎందుకంత తొందర. ఇప్పుడే గదా మనం బయలు దేరింది. ఈ నాడేమో నాకు పురవీధులన్నీ వింత వింతగా తోస్తున్నవి. అవునా?

చెన్ను:- చిత్తం, కాని శుద్ధోదన చక్రవర్తులుంగారి ఆజ్ఞలకు భిన్నంగా రథాన్ని.........

సిద్ధా:- (వినిపించుకోకుండా నే) చెన్నా! అదుగో అటు చూడు. ఆ పసిగందులైన పిల్లలు, తల్లి, వాళ్ళేమిటి దీనారావం చేస్తున్నారు. అందరు ఎందుకు అట్లా విదిలించి కొడుతున్నారు, వాళ్ళను.

చెన్న:- ఆకలి తీర్చు కుంటానికి యాచిస్తున్నారు స్వామీ!

సిద్ధా:- ఆకలి అంటే ఏమిటి చెన్నా?

చెన్న:- అంటే కడుపులోని మంటలు ఆర్చు కుంటానికై పట్టెడుకూడు వెయ్యమని వేడుకుంటున్నారు ప్రభూ!

సిద్ధా:- చెన్నా! మన రాజ్యం లో భోజనం దొరకని వారు కూడా వుంటారా!

చెన్న:- ఎందుకు వుండరు ప్రభూ! ఎంతటి సుభిక్షమైన రాజ్యంలోనైనా ఆకలి బాధ అనుభవించే వారు వుంటారు ప్రభూ! అది ప్రభువుల లోపం కాదు. వారి వారి పూర్వ జన్మల కర్మఫలం.

సిద్ధా:- చెన్నా! ఈ నాడేమో చిత్రమైన మాటలు వింటున్నానే నీవద్ద నుంచీ. ఆకలియా! పూర్వజన్మయా! కర్మఫలమా! ఏమిటో చోద్యం! ఆకలి అనే విచిత్రమైన జాడ్యంతో ప్రజలు బాధలుపడతారనే విషయం నాకింతకు ముందు తెలియదే. అవును గాని పూర్వజన్మ కర్మఫలమని యేమో అన్నావు. అదియేమిటి చెన్నా?

చెన్న:- ప్రభూ! అజ్ఞానిని, నన్నా మీరలడుగు చున్నది. పుట్టుకతోనే కొండంత జ్ఞానాన్నియిముడ్చు కొని పుట్టిన కారణ జన్ములు తమరా నన్నీ ప్రశ్నలు వేయడం.

సిద్ధా:- చెన్నా! ఆకలి బాధ అన్నావే, పోనీ దాన్ని గురించైనా చెప్పు. ఆ బాధ తీరకపోతే పర్యవసానం?

చెన్నా:- ప్రభూ! పెట్టిపుట్టిన తమలాంటి ప్రభువులకు ఏమని చెప్పగలను ఆకలి బాధను గురించి. ఆకలి బాధతో అటమటించి ఎంత మందిచావటంలేదు. బీదల ఆకలి బాధను గురించి ఏమని చెప్పమందురు. ఆరోగ్య వంతంగా, సంతోషంతో, ఆనందంలో ఊగిపోయే సంఘానికి చీడపురుగులాంటిది ప్రభూ ఆకలి. అదిగో ఆ యిల్లాలు చూడండి. రొమ్మున పాలులేక, ఎండి పోయిన రొమ్ముతో, పగిలే గుండెలతో పాలకొరకు, తిండికొరకు నకనక లాడి యేడ్చే ఆ పిల్లల గోడు పడలేక, ధర్మం వెయ్యకుండా విసరికొట్టే ఆధార్మికుల పరుషభాషలు వినలేక, విధిలేక కుంచుకుపోయి ఎట్లా చూస్తుందో చూడండి ప్రభూ. ( కలవర పాటుతో ) ప్రభూ! క్షమించండి. నాకీపూట మతిచెడినట్లుంది. శుద్ధోదన చక్రవర్తులుంగారి ఆజ్ఞలకు వ్యతిరేకంగా రధాన్ని బయటకు తీశాను. పైపెచ్చు వారి చండ శాసనాన్ని ధిక్కరించి యీపూట అతిగా వాగు తున్నాను.........

సిద్ధా:- చెన్నా! ఆగిపోయా వేమి, చెప్ప చెన్నా. ప్రభువుల ఆజ్ఞలు తరువాత పాటింతువు గాని. ఆకలి అంత ప్రమాద కరమైన జాడ్యమా? అదితీరక పోతే మానవుడు చనిపోతాడా? చనిపోవడమంటే ఏమిటి చెన్నా? అబ్బా! అతఃపుర మనే నవరత్న ఖచిత సుందరమైన పంజరములో యిరుక్కు పోయి యిన్ని నాళ్ళు ప్రపంచాన్ని చూడనేలేక పోయానే. చెన్నా!

నీవు నాకంటే ఎంతో జ్ఞానవంతుడివిగా కని పిస్తున్నావు.

చెన్న:- అపచారం ప్రభూ! ఎంత లేసి మాటలు వింటున్నాను. తమఉప్పు పులుసు తినిబ్రతికేవాణ్ణి, నేనా మీకంటే జ్ఞానవంతుణ్ణి. క్షమించండి ప్రభూ!

సిద్ధా:- ఉప్పు పులుసూ తింటున్నావో లేదో గాని అంత మాత్రం చేతనే ప్రభువుల కంటే నీకు జ్ఞానం తక్కువని ఎందుకనుకుంటున్నావు చెన్నా.

చెన్న:- ప్రభూ! శుద్ధోదన చక్రవర్తులుంగారి ఆజ్ఞలేనిదే రథాన్ని తమకు............

సిద్ధా:- (అర్థోక్తిలో) సిద్ధం చెయ్యనద్దని. అంతేనా? అబ్బా! ఎన్నిసార్లు చెబుతావు చెన్నా.

చెన్న:- చిత్తం ప్రభూ.

(చెన్నుడు రథాన్ని ముందుకు సాగి పోనిస్తాడు. రథం పది గజాలు దాటిందో లేదో వయోభారంతో వంగిపోయి అతుక్కుపోయిన పొట్టతో, పుటీకఱ్ఱ ఆధారంచేసి కొని, గాలికికొట్టుకుపోయేటట్లుగా, కనుపించే ఒకవనిత ఎదురుగా వస్తుంది. పైగా పుట్టెడుచెవుడు, చూపుతక్కువ. చెన్నుడు ''ప్రభువులుంగారి రథం, తొలుగు, తొలుగు.'' అని ఒకటి రెండు సార్లు కేకలు వేసి లాభంలేక రథాన్ని ఆపుతాడు.)

సిద్ధా:- చెన్నా! మానవాకారంలో ఉన్న ఆవస్తువు ఏమిటి? ఎదోనీడ మాదిరిగా కదలి వస్తూంది.

చెన్న:- ఆమె వృద్ధాప్యం పొందిన ఒక వనిత.

సిద్ధా:- (చకితుడై) ఏమిటన్నావు చెన్నా. ఆమె స్త్రీయా! విచిత్రంగా ఉందే! ఆమెకూ అంతఃపుర స్త్రీలకూ పోలికే లేదే. అంతఃపుర స్త్రీలు సర్వదా కళ కళ లాడుతూ, ఎప్పుడూ సౌందర్యాన్ని వెదజల్లుతూ, ఆనందంగా కనుపిస్తుంటారే ఇదేమి యీమె యింత వికృతంగా ఉంది! కారణం?

చెన్న:- ప్రభూ! ఆమెను నేను ఎరుగుదును. వయస్సులో ఉండగా ఆమె అంత అందగత్తె బహుశా కపిలవస్తు నగరంలోనే లేదేమో (క్షణమాగి) ఒక్క అంతః పురం మినహాయిస్తే. పాపం వయస్సు మళ్ళింది. ఏళ్ళు మీదపడి వృద్ధాప్యం వచ్చేసరికి వాటిబరువు భారంతో వంగిపోయి జవసత్వా లుడిగి కాటికి కాళ్ళు చాచుకొని కేవలం మానవాకారం మాది రిగా కనిపిస్తూన్న వయోవృద్ధురాలు స్వామీ ఆమె యిప్పుడు.

సిద్ధా:- అయితే చెన్నా! ఏళ్ళుమీద బడతాయా? అప్పుడు నువ్వు, నేను, అందరం యిట్లాగే కనిపిస్తామా? అనంత సౌందర్యానికి మారుపేరైన నా యశోధరకు గూడ ఏళ్ళు మీద బడతాయా? ఆమె కూడ యింత వికృతంగా కనబడుతుందా? అబ్బా! చెన్నా, వినలేకుండా వున్నాను. నిజంచెప్పు చెన్నా. (రుద్ధకంఠం పడుతుంది.)

చెన్న:- ప్రభూ! మహారాణులుం గారికి ఎన్నడూ ఏళ్ళు మీద బడవు. తమరూ మహారాణీ సర్వకాల సర్వా

వస్థల్లోనూ, చిరస్థాయిగా యిట్లాగే నవనవలాడుతూ ఉంటారు ప్రభూ!

(ఇంతలో రంగస్థలంపైకి ఒక కుష్ఠురోగి ప్రవేశించును. ఒణుకుతున్న శరీరంబద్దకఱ్ఱలాగ గాలికికొట్టుకుపోయేటట్లు కనుపిస్తూవుంటాడు. బాధకు మూతి వంకర్లు తిరిగి పోతూంటుంది.)

కుష్ఠు:- (జాలిగా) అయ్యలారా! నన్ను లేవదీయండి ఇంటిదాకా చేర్చండి. నా ప్రాణం ఈలోపలే పోయేట్లుంది. (లేవటానికి ప్రయత్నిస్తూ సగంలేచి తిరిగి ఒణుకు వచ్చి పడిపోతాడు.)

కుష్ఠు:- బాబూ! పుణ్యం ఉంటుంది. నన్ను కాస్త యింటికి చేర్చండి. (సిద్ధార్థుడు వడివడిగా వెళ్ళి రోగిని లేవనెత్తి ఆర్ద్ర హృదయంతో కనికరం ఒలకబోస్తూ తన చల్లటి హస్తాలతో స్పృశించుతూ అతని తలను తన తొడలమీద ఉంచుకుంటాడు. రోగి మూలుగుతూ ఉంటాడు.)

సిద్ధా:- ఏమి జరిగింది నాయనా. ఎందుకు బాధ పడుతున్నావు. (రోగి మూలుగుతాడు.) చెన్నా! ఎందుకు అట్లా మూలుగుతాడేగాని మాట్లాడడు. కారణం?

చెన్న:- ప్రభూ! రోగపీడనతో శల్యావస్థలో వున్నాడు. అతను కుష్ఠురోగి. ఒదలండి స్వామీ ముట్టుకోరాదు.

సిద్ధా:- కుష్ఠురోగమా! అంటే ఏమిటి చెన్నా! దేశంలో యింకా యిట్లాంటి వాళ్ళు ఉంటారా? ఈ రోగం నన్నూ నాయశోధరనూ గూడా ఆవరించవచ్చునా?

చెన్న:- మానవుల కీ జాడ్యాలు చెప్పకుండానే, తెలియకుండానే వస్తూ ఉంటాయి ప్రభూ. ఇవి భయంకరమైన జాడ్యాలు.

సిద్ధా:- అయితే చెన్నా! మానవుడు నిరంతర భయోత్పాతంతో బ్రతుకుతున్నాడన్నమాట. ఎప్పుడేది సంభవించునో, ఏ క్షణాన ఏ ఆపద గల్గునోగూడా తెలుసుకోలేని అసహాయ స్థితిలో ఉన్నాడన్నమాట. అంతేనా? అబ్బా! యితని బాధ నేను చూడలేను చెన్నా.

[చెన్నుడు కష్ఠురోగికి సౌంజ్ఞ చేస్తూ అయిష్టంగా అంటీ అంట నట్లు చేయూత నిచ్చి లోనికి దీసికొని పోవును.]

సిద్ధా:- చెన్నా! నేను నాన్నగారి కోర్కె ననుసరించి యీ పుర వీధులలో అనేక పర్యాయములు విహారం చేశానే, అపుడప్పు నాకీ దృశ్యాల్లో ఏ ఒక్కటీ కనిపించనే లేదే. ఈ నాటి మన దురదృష్ట మేమిటి? అప్పుడు ఎటుచూచినా సుందరమైన యువతులూ, ఆరోగ్యకరమైన యువకులూ, కిలకిలలాడే పసిపాపలు, అంతటా ఆనందం తాండవమాడేదే ఈనాడేమి అట్టి దృశ్యాలు ఒక్కటీ కనుపించటం లేదు.

చెన్న:- (నోరుజారి) అప్పుడంటే మహారాజులుంగారి ఆజ్ఞలు ముందు, తరువాత తమ విహారం గనుక ...... (ఆగిపోతాడు.)

సిద్ధా:- ఆగిపోయావేమి? చెప్పు చెన్నా.

చెన్న:- ప్రభూ! క్షమించండి. ఏమీలేదు. ఏదో తెలియక నోరు జారాను.

[ఇంతలో సిద్ధార్థుడు మరొక దిక్కుకు చూచి ఉలిక్కి పడతాడు. నాలుగువైపులా నలుగురు మోస్తూ శవపేటికను తీసికొని వస్తూ ఉంటారు. వెనుక ముప్ఫయి సంవత్సరాల యువకుడు

తడిసిన బట్టలతో నీటికుండ బుజాన బెట్టుకొని, బొడ్డున కొడవలి ఉంచుకొని వస్తూఉంటే, ప్రక్కనే కొద్దిమంది విచార సముద్రంలో మునిగి నడువలేక నడువలేక నడుస్తూ నిశ్శబ్ద సంపుటులను తిరగ వేస్తుంటారు. సిద్ధార్థుడా దృశ్యాన్ని చూడగానే చకితుడై, సంభ్ర మాశ్చర్య జనితోద్రేకంలో పడిపోతాడు.]

సిద్ధా:- చెన్నా! ఇదిఏమి? ఈ దృశ్యం బహువింతగా వుందే. వారంతా ఏమిటి మోసుకు పోతున్నారు? పెదవులైనా కదల్పక మౌనముద్రాంకితులై కాళ్ళీడ్చుకొంటూ వెనుక కొందరువస్నా రెందుకు?

చెన్న:- శవాన్ని మోసుకు పోతున్నారు స్వామీ.

సిద్ధా:- శవమా! అంటే? (శవపేటిక రంగస్థలం పైకి ప్రవేశింపజేయబడును.)

చెన్న:- పాపం, ఎవరో దురదృష్టవంతుడు రోగం వచ్చో, కాలంతీరో, మరణించాడు., (శవపేటిక దాటిపోతుంది)

సిద్ధా:- మరణమా! అంటే ఏమిటి చెన్నా?

చెన్న:- అంటే జీవాత్ముడు ఈ తనువును చాలించి యింకో తనువులో ప్రవేశిస్తాడు స్వామీ.

సిద్ధా:- చెన్నా! యీ పూట నీ మాటలన్నీ విచిత్రంగానే ఉంటున్నవే? నాకంతా అగమ్యగోచరంగా ఉంటుంది. మానవులు చనిపోతారా! అంటే జీవాత్మ ఏమిచేస్తుం దన్నావు? యీశరీరాన్ని వదలి మరొక నూతన శరీరంలో ప్రవేశిస్తుందా! అంతేనా? జీవాత్మ అంటే ఏమిటి చెన్నా? ఎప్పుడూ చెప్పావు

కావు. అది యీ శరీరాన్ని వదలి ఇంకో శరీరంలో ఎందుకు ప్రవేశించాలి. ఈ శరీరం చేసిన తప్పేమిటి? తప్పులేకుండానే యీ శరీరాన్ని వదిలి యింకో శరీరంలోచేరి జీవాత్మ యీశరీరాన్ని అట్లా ఎందుకు శిక్షించాలి. ఇంకోశరీరాన్ని ఎందుకు భ్రమపెట్టాలి. చెప్పు చెన్నా. ఏమిటిదంతా. అసలు జీవాత్మ స్థిర నివాస మెక్కడ? నిదా కర్తవ్య మేమిటి ? కారణ రహితంగా శరీరాల్ని ఎందుకు కష్ట పెట్టాలి ? ఎందుకు భ్రమింప జేయాలి? జీవాత్మ యొక్క వుద్యోగమే అదా? చెప్పు చెన్నా.

చెన్న :- ప్రభూ! యీపూట నాకేదో పిచ్చి యెత్తింది. ఏమి టేమిటో వాగుతున్నాను. మతిలేని, అర్థంలేని నా వాగుడు సాగదీయకండిప్రభువులు, అనివేడు కొంటున్నాను. స్వామీ! ప్రొద్దు బోతూ ఉంది. మనం యింటి ముఖం పట్టాలి.

సిద్ధా:- (రుద్ధకంఠంతో) చెన్నా! పోనీ యిదైనా చెప్పు. నా అనుంగు జనకుడు శుద్ధోదన చక్రవర్తి, నా ప్రియ సతియశోధర, నారాహులకుమారుడు, నేనూ, నీవు అందరూ మరణించి తీరాలన్న మాట వాస్తవ మేనా? అదిమాత్రం యదార్థ మని, అనంతసత్య మని, మీకందరికి తెలుసు గదా. తెలిసే ఎందుకు చెప్పలేదు నాకిన్ని నాళ్ళు? అబ్బ! నేనిక యీ దృశ్యాలు చూడలేను. రథాన్ని వెనుకకు మర లించు చెన్నా. నాకళ్ళ నుంచీకారు తున్నవి కన్నీటి బిందువులు గావు, రుధిరప్రవాహాలు;రక్తస్రవంతులు;

చెన్నా. అబ్బా! యీపూట రథాన్ని ఎందుకు తీశావు బయటికి? నా ఆజ్ఞలు తిరస్కరింప లేక పోయావా! చెన్నా చెప్పు. మాట్లాడవేమి? రథాన్ని మరలించనే లేదా చెన్నా.

[నేపథ్యంనుంచీ పవనవీచికా సంగీతం వినబడు తుంటుంది.]

"విసిగి, వేసారి విధివిరామమే తెలియక నిత్యమున్
పయనించు పవన ధ్వను లివిసుమ్మ;
శాంతి, విశ్రాంతియంచు ఆక్రోశింతుమే గాని
ఎన్నడును విశ్రాంతి నెరుగలేము;
సంతత సంచారమున్ సల్పుపవనంబు బోలు
భౌతిక కాయంబు సుమ్మ;
ఇదియొక ఆక్రందనంబు, ఒక్క నిట్టూర్పు, ఒక్క శోకగీతమ్మ,
ఒక్క ప్రళయ ప్రభంజనమ్మ, ఒక్క సంఘర్షణమ్మ గాదె!"

సిద్ధా:- చెన్నా! ఎక్కడిదీ అవ్యక్త మధుర వేదనాస్వనం విస్మృతి పథాలపడ్డ ఏ స్మృతిశ్రుతులనో లగించి మీటుతున్న విశ్వ విపంచీ స్వనములా చెన్నా! వినిపించనే లేదా! యిటు, యిటు, యిటు చెన్నా, అబ్బా! ఎంతటి బధిరుడవు. (తిరిగి పవనవీచికా సంగీతం వినపడు తుంది.)

"ఈ అనంత యాత్రా ప్రవాసాన పయనించు
వేసటే ఎరుగని బాటసారివి నీవు;
ఎచట బయలుదేరి, ఎందేగు చుంటివో,
తెలియగా రాని పాంథుడవు సుమ్మ;
ప్రాణి యన్న నేమొ, దాని పయనమేమొ,
ఎందు పరిఢవిల్లి ఎటకేగునో ఎరుగరావు;
పవన వీచికా పథమ్ము ప్రాణిపథంబు,

కదలి నూన్యంబులో కరగిపోవు వీణాస్వనమ్ము లీ సుఖమ్ములు,
జీవితమ్మె, తెరలులేని, రంగులే వేయని, ఒక్క శూన్య నాటక
ప్రదర్శనమ్ము కాదె!"

సిద్ధా:- చెన్నా! వినిపించనేలేదా! ఇటు, అటు, అంతటా ఏదో ప్రళయ ప్రభంజనము చెన్నా! నాలో ఏదో అనంత మధుకీల! ప్రపంచ ప్రసవవేదన!! సృష్టి, స్థితి, లయ, కారణ కార్యముల తాత్పర్య బోధను చేయు ఒక మహాఘోష!!! విను. చెన్నా! విను. విన్నావా?

చెన్న:- లేదు. ప్రభూ! ఏమీ వినిపించటంలేదు. (మరల పవన వీచికా సంగీతం వినపడుతుంది.)

"ఈ విషాద మానవాళి వేచియున్నది నీకొరకు నేటివరకు,
లేచిరమ్ము, మరల నిద్రించబోకుమీ నిద్రాణ నీరవ గళంబు
విడనాడి,

ఎలుగెత్తి పిలువుమో సిద్ధార్థ బుద్ధ మార్గాన."

సిద్ధా:- చెన్నా! ఎక్కడిదీ వైతాళికాగీతం. పవనవీచికా సంగీతమా! మీటిన విశ్వవిపంచీ స్వనం మెట్లు తెంచుకొని తురీయావస్థలో పడెనాఏమి? చెన్నా. వినిపించలా? ఎంతటి బధిరుడవు! యిటువిను. అటు విను. ఆకాశంపైనించి. భూమిక్రిందినుంచి. విను. అంతటా వినిపించే విశ్వఘోష అది చెన్నా?

(సిద్ధార్థుడు అచేతనుడై నేలవ్రాలును చెన్నుడు తత్తరపాటుగా "ప్రమాదం; ప్రమాదం; పానీయం, పానీయం;" అంటూ తత్తర పాటుగా రంగస్థలంపై అటునిటు పరుగుతీస్తూ వుంటాడు.)

[ తెర త్వర త్వరగా పడును. ]

---

అంతఃపురము. శుద్ధోదన చక్రవర్తి తనకుగాను నిర్మించిన భవనాలు మూడింటిలోనూ శీతాకాలానికి నాసయోగ్యమైన భవనంలో మెత్తటి పాన్పుపైన పవళించి ఉంటాడు సిద్ధార్థుడు. సమయం మధ్యాహ్నం మూడూ నాలుగు గంటలమధ్య ఉంటుంది. నవరత్నఖచితమైన ఆసనాలు రెండు మూడు కలవు. గది అంతటా తివాచీలు పరచి ఉంటాయి. సుగంధ ద్రవ్యాల పరిమళం ఘుమాయించి నలుదిశలా కొడుతూంటుంది. వివిధ చిత్రకారుల పనితనమంతా వుపయోగించి చిత్రించబడ్డ సుందరాంగుల చిత్రపటాలు వ్రేలాడుతుంటాయి. ఒకప్రక్క విశ్వామిత్రుడు, మేనక, అనురాగరక్తులై రతికి ఉపక్రమింపజూసే భావస్ఫురణచేసే చిత్రపటం వ్రేలాడుతూంటుంది. మరొకప్రక్క స్వర్గలోకంలో రంభా ఊర్వశీ మేనకాదులు స్వర్గసీమలకు ప్రయాణంచేసి వచ్చిన సోమయాజులను రక్తికి ఆహ్వానిస్తూ మిడిసిపడే యౌవ్వనంతో పొంగులు దేరుతున్నట్లు వ్యక్తంజేసే చిత్రపటాలు, యింకొక దిక్కున రతీమన్మధులు ప్రణయాన్ని పొలకబోస్తూ చూచేవారిని ఉద్రేకపరచేటట్లున్న భంగిమలోఉన్న చిత్రపటం వేళ్ళాడగట్టి ఉంటుంది. ఆ గదిలోని వాతావరణం ఎంతటి విరాగులనైనా భ్రమింపజేసి అనురాగరక్తులగాను లంపటత్వ పరులనుగానూ చేసేటట్లు కనుపిస్తూంటుంది.

యశోధర ప్రవేశిస్తుంది. ఆమె గదిలోప్రవేశించిన క్షణకాలానికి సిద్ధార్థుడు నిద్రనించి మేల్కొని మత్తుగా కనిపిస్తాడు. యశోధర చల్లటి పానీయం తీసికొని దగ్గరకు పోతుంది. సిద్ధార్థుడు పానీయం పుచ్చుకుంటాడు. యశోధర క్రింద తివాచీమీద కూర్చుండి సిద్ధార్థుని పాదాలు వొత్తుతుంటుంది. సిద్ధార్థుడు శూన్యదృక్కులతో చూస్తూ, యశోధరను అగ్గంగా దగ్గరకు తీసుకొని పాన్పుమీద కూర్చోబెట్టుకుంటాడు. యశోధర క్షణకాలం చకిత అవుతుంది. కారణం తనభర్త కొద్దికాలంనుంచి మరీ ఆలోచనా సాగరంలో మునిగి తేలుతూ జిజ్ఞాసా భూయిష్ఠ పరుడుగాఉంటూ తనకు

అప్పుడప్పుడు ప్రసాదిస్తున్న క్షణికానందాన్నిగూడా ప్రసాదించకుండా తనను చూస్తూగూడా యదాలాపంగాఉంటూ వింతగా ప్రవర్తిస్తున్నాడు. యశోధర తన భర్త ఆప్యాయతకు అమందానంద భరితురాలవుతుంది. భక్తి ప్రేమల పారవశ్యాలలో తన భర్తవైపు తదేక ధ్యానంతో అర్ధనిమీలిత నేత్రఅయి అతనిలో లీనం అయిపోదామా అన్నంత ఆనందంతో చూస్తుంది.

యశో:- ప్రభూ ! గాయకురాండ్రు...

సిద్ధా:- (వ్యతిరేక భావాన్ని సూచిస్తూ తలవూపుతాడు)

యశో:- మరి నాట్యకత్తెలో...

సిద్ధా:- (తిరిగి తలవూపుతాడు)

యశో:- నీలిమ తాను నేర్చుకొన్న నూతన నృత్యాన్ని తమముందు ప్రదర్శింప ఉవ్విళ్ళూరు తున్నది ప్రభూ !

సిద్ధా:- (మౌనం)

యశో:- తాము తిలకించెదమని వాగ్దానం గూడా చేసియుంటిరి గదా.

సిద్ధా:- అవును.

యశో:- నీలిమా !

[నీలిమ గజ్జెలందెల రవళుల సందడితో నాట్యకత్తె భంగిమలో మెరపు తీగలాగ రంగస్థలంపైకి ప్రవేశిస్తుంది. నీలిమ నృత్యంచేస్తూ యశోధరా గౌతములను తన్మయత్వంలో నింపుతూ తానుగూడ తురీయావస్థలో పడుతుంది. నృత్యం ముగించి ఆయాసాన్ని కప్పిపుచ్చుకుంటూ సిద్ధార్థునికి తలవంచి నమస్కారం జేస్తుంది.]

నీలిమ:- ప్రభూ! సెలవా.

సిద్ధా:- నీలిమా! నీ నృత్యం మాకు మహదానందాన్ని కలిగించింది సుమా.

నీలిమ:- అదంతా నా అదృష్టం ప్రభూ!

సిద్ధా:- నీలిమా! నీవు నిజంగా నాట్యరాణివి.

నీలిమ:- (నీలిమ వినమ్రతతో తలవంచు కుంటుంది.)

యశో:- (ఉద్వేగంతో) నీలిమా! నీవు నిజంగా ధన్యురాలవు. యువరాజులను ఆనంద పరచిన నీ అదృష్టానికి మేరలులేవు. ఇదిగో యీబహుమానాన్ని అందుకో. (తన కంఠహారాన్ని తీసియిస్తుంది. నీలిమ కంఠహారాన్ని తీసుకొని నెమ్మదిగా నిష్క్రమిస్తుంది.)

యశో:- (కొద్దిసేపున్నమీదట) ప్రభూ! ఒక్క విషయం అడుగనా? అనేక పర్యాయములు అడుగుదామని సిద్ధపడి కూడా సాహసింపలేక మానివేశాను. ఈనాడైనా నాకా సాహసంలేదు. కాని తమ అనుజ్ఞ అయినచో అడుగవలెనని కుతూహలంమాత్రం ఉంది.

సిద్ధా:- సందేహించకు.

యశో:- (సిద్ధార్థుణ్ణి తన కోమల హస్తాలతో స్పృశించుచూ ప్రణయ దృక్కులతో) ప్రభూ! మామగారు మొన్న పిలిపించి "తల్లీ! నేనా వృద్ధుణ్ణి; రాచకార్య భారాన్ని యిక మోయలేను. యువరాజా ఆ బాధ్యతల సంగతి గుర్తించక ఏదో ఒకరకంగా ఉంటూ ఎప్పుడూ ఆలోచనలతో సతమతమవుతున్నట్లు కని

పిస్తాడు. ఇంతపిన్న వయస్సులోనే యువరాజుకి అంతటి విరక్తి ఎందుకు కలిగిందో నీవైనా చెప్పవు. నీవు యెప్పుడూ యువరాజు నీడమాదిరిగా ప్రవర్తించడమేగాని ఆయన బాధ్యతల్ని గుర్తుచేసి కర్తవ్య పాలన చేయించవైతివి. ఎట్లా చెప్పుతల్లీ'' అని కంటనీరెట్టు కున్నారు స్వామీ.

సిద్ధా:- పాపం, నాన్నగారికి నావల్ల ఎంత మనఃక్లేశం కలుగుతూ వుంది. కాని నన్నేమి చేయమందువు దేవీ.

యశో:- మంచిలగ్నం చూచి రాచకార్యభారాన్ని మీ భుజాలపైకి తీసుకోవటమే స్వామీ.

సిద్ధా:- అంతమాత్రం చేతనే నాన్నగారి విచారం పోతుందా యశో.

యశో:- తప్పకుండా స్వామీ.

సిద్ధా:- నేను ప్రజలను పీడించుకు తింటాననుకో అప్పుడు.

యశో:- అసంభవం. కరుణాసముద్రులు, అహింసావాదులు, సత్యాన్వేషకులు తమరెప్పుడట్లా చెయ్యరు ప్రభూ!

సిద్ధా:- నా పాలన అసమర్థమైతేనో.

యశో:- తమరా అసమర్థులు. ఎన్నటికీకారు. తమరు ప్రజలను ప్రగాఢంగా అభిమానిస్తూ ఎంతో దక్షతతో కారుణ్యవంతులై పరిపాలిస్తూ వారిపై ప్రభువులు మాత్రమేగాదు వారి అధినేతలు కూడాను అని కీర్తి పొందుతారుస్వామీ. మామగారికోర్కె. ఈ

దీనురాలికోర్కె, ప్రజలకోర్కె, అందరికోర్కెలూ అవే ప్రభూ.

సిద్ధా:- (చిరునవ్వు నవ్వి) యశో! నేను రాజ్యపాలన చేపట్టినందువల్ల గలిగే ప్రయోజనం!

యశో:- ప్రభూ! ప్రజానురంజకంగా రాజ్యపాలన చేయుట కంటే, రాజుల ప్రథమ కర్తవ్యం ఏమిటో చెప్పండి.

సిద్ధా :- దేవీ! నిజమే గాని అంత మాత్రం చేతనే మానవ కోటి పొందుతున్న అనంత ప్రసవ వేదనకు పరిసమాప్తి కలుగదు గదా. మానవ కోటి పొందే యీ నిరంతర వ్యధకు తరుణోపాయం వుండి తీరాలి. ఆసత్య పథమేదో అన్వేషించినచో ఒక్క శాక్యరాజ్య ప్రజలకే గాక సర్వ మానవ కోటికీ గూడ యుగ యుగాలుగా మార్గగాములమై చక్రవర్తులకే చక్రవర్తులమై మానవ కల్యాణం సాధించవచ్చునే మరి. దానిని మించిన ఆనందం యింకే ముంటుంది చెప్పు.

యశో:- ఎవరో సర్వసంగ పరిత్యాగులైన యోగులు చెప్పే మాటలు చక్రవర్తులు, క్షత్రియకులజులు అయిన మీరు చెబితే ఎట్లుస్వామీ. మీరు రాజవంశంలో పుట్టారు. మీ కర్తవ్యం ప్రజలను క్రమమార్గంలో పరిపాలించటం. మీ కర్తవ్యాన్ని మీరు నిర్వహించండి, అని వేడు కుంటున్నాను.

సిద్ధా:- దేవీ! పోనీ మానవులకు యీ వ్యధలు, అనంత ఆవేదన ఎందుకు కలుగు తున్నాయో చెప్పు. మానవులు సంతతానంద పరులుగా వ్యధలు లేని

జీవితాలుగడిపే మార్గం ఏదైనావుందేమొ యెన్నడైనా వూహించావా?

యశో:- లేకేమి స్వామీ. తమవంటి ఉత్తమ చక్రవర్తులు ఉద్భవిల్లి పరిపాలనా భారాన్ని వహించి తమ వుదాత్త పరిపాలనలో ప్రజలను వోలలాడించిన వారికి సంతతానందం నిత్యకల్యాణంగాక మరేమిటి చెప్పండి ప్రభూ.

సిద్ధా:- దేవీ! యిప్పటికే నన్ను ఆవరించివున్న సంసార తృష్ణను వొదిలించుకోలేకుండా సతమతమవుతుంటే పై పెచ్చు రాజ్యతృష్ణగూడ నీవు నాలో ప్రకోపింపజూస్తున్నావా? ప్రయోజనంలేదు. ఎంతసేపటికీ సరససల్లాపాలు చెయ్యటం, నృత్య గీతాదులు వినిపించటం, రాజ్యపాలన చేయమనడం అహర్నిశలు యీ ప్రయత్నాల్లో నీజీవితకాలాన్ని వృధా చేస్తున్నావేగాని, దేవీ, మానవజాతి యిన్ని యిక్కట్లు ఎందుకు పొందుతుందో యీ మనోవ్యధలు ఎందువల్ల కలుగుతున్నాయొ వీటి నివారణకుగల తరుణోపాయమేమొ అన్న సమస్య నీ వెప్పుడైనా వూహించావా చెప్పు. నీవేకాదు. మానవజాతే వూహించుకోవటంలేదు. ఊహించుకొనే తీరికగూడ కరువు చేసుకొని ఆశాపాశాలతో ఎగబ్రాకుతూ కోరికోరి యీ వ్యధలను తెచ్చిపెట్టు కుంటున్నది.

యశో:- ప్రభూ! ఎవరెవరి పూర్వజన్మల కర్మఫలాలు వారు యీ జన్మలలో అనుభవిస్తూ వుంటారు. దీనికి ఎవరు కర్తలు చెప్పండి?

సిద్ధా:- అట్లైన ఎంతటి ధర్మచక్రవర్తియైనా చెయ్యగలిగింది ఏముందిగనుక. ప్రజలు వారివారి పూర్వజన్మల కర్మఫలాలవంతు కష్టాలు అనుభవించ వలసిందేగా మరి. ఇక మన ప్రయోజనం ఏముంది?

యశో:- అట్లని ఊరుకుంటామా స్వామీ.

సిద్ధా:- ఊరుకోనక చేసేదేమి దేవీ. విధికృతమంటివి గదా. అవునుగాని ఎవరునేర్పారు యీ పాఠాలు నీకు. పూర్వజన్మ కర్మఫలమా. ఏమిటీ సిద్ధాంతం? పూర్వజన్మ వుంటే ఆ జన్మలో చేసుకొన్న దానికి అప్పుడే అనుభవించేటట్లు చేసిన కొంత ప్రయోజనం, నిష్కృతి, వుంటుందేమోగాని ఆ జన్మలో చేసికొన్న దానికి ఫలితంగా మరోజన్మలో అనుభవిస్తారు, అనుభవించాలి, అనటంలో తాత్పర్యం ఏమిటి యశో. పూర్వజన్మలలో యీ అనంత మానవకోటి చేసేపనులు ఏవేవో అన్నీ రోజువారీ పద్దులు తయారుచేసే ఉద్యోగి ఎవరు? ఒకరా? వంద లాదిగ ఉంటారా? ఉంటే వారికిలేవా మరి జన్మలు? వారికి కూడ పునర్జన్మలుంటే యీ పద్దులన్నీ వ్రాయమని ఎవరికి వప్పజెప్పి పోతూవుంటారు?

యశో:- అవన్నీ ఆ పరమాత్ముని లీలలుస్వామీ. మానవ మాత్రులం మనమేమి చెప్పగలం. మన విధులు మనం నిర్వహించాలనే నాకు తెలుసు. పై పెచ్చు నేనేమి చెప్పగలను స్వామీ. అందునా మీకు చెప్పగలనా!

సిద్ధా:- పరమాత్ముని లీలలా ! ఎంత చోద్యమైన సంగతి. పరమాత్ముని లీలలు యింత వికృతంగా వుంటాయా. కొందరు సంతోషంలో మైమరచి పోతూంటే, మరి కొందరు విచార సాగరంలో మునిగివుంటే కొందరు భ్రమలలో, మరికొందరు నిర్వేదంలో, కొందరు యవ్వనంలో, మరికొందరు వృద్ధాప్యంలో, కొందరు ఆరోగ్యంతో, మరికొందరు రోగపీడనతో పలు రకాలుగా, ఒకే సమయంలో, ఒకే చోట, పొంగి, వుప్పొంగి, క్రుంగి, క్రుశించి, అజ్ఞానంలో యీదు లాడు తున్నారుగదా. ఇవన్నీ పరమాత్ముని లీల లంటున్నావే. అది మీరూహించు కుంటున్న పర మాత్మునికే అన్యాయం చెయ్యటం అవుతుంది యశో. ఈ పరస్పర విరుద్ధ సంఘటనల ఫలితంగా మానవకోటి బాధామయ జీవితాలను గడుపుతుందే గాని మరి ఆపరమాత్ముడు పొందే ఆనంధంమాత్రం యేమిటో నాకు అర్థం గావటంలేదు సుమా. (ఆవేశ పడతాడు)

యశో:- (సిద్ధార్థునికి ఆగ్రహం కలిగిందనే భయంతో) ప్రభూ ! మన్నించండి, మీ ప్రణయదాసిని. ఏదో తెలియక మాట్లాడాను. కారణజన్ములు మీకు తెలియనిది గాని, తెలుసుకోవలసినది గాని యేముంటుంది ప్రభూ! ఆగ్రహించక అనుగ్రహించండి, అని వేడుకొంటు న్నాను అంతే.

సిద్ధా:- ఈ సిద్ధార్థునికి ఆగ్రహమంటే యేమిటో యింత వరకూ తెలియదే. పై పెచ్చు నీమీద ఆగ్రహమా!

యశో:- స్వామీ. ధన్యురాలను. నాజన్మ కది చాలును. మరి మామగారి అభీష్టంగూడ నెరవేరితే శాక్యరాజ్యంలో ఆనందం, నిత్యం, నృత్యం చేస్తుంటుంది ప్రభూ.

సిద్ధా:- (వినిపించుకోనట్లు యాదాలాపంగా వుంటాడు. యశోధర సాహశించి సిద్ధార్ధుని గడ్డం పట్టుకొని గోముగా తనవైపుకు త్రిప్పుకొంటానికి ప్రయత్నిస్తుంది. ఇంతలో తెర లోపలినుంచి "యువరాజా! శుద్ధోదన చక్రవర్తులుంగారు తమతో అవశ్యం మాట్లాడవలసిన ముఖ్యవిషయ మేమిటో గలదట. తమ్ము త్వరగా దయచేయమని ఆనతి. రథచోదకుడు చెన్నుడుగూడ అందేగలడు." అని ఒక పురుషకంఠం వినబడుతుంది.)

యశో:- అవును, స్వామీ మరచిపోయాను. మామగారి ఆజ్ఞలకు భిన్నంగా చెన్నుడు రథం బయటకు తీశా డట. వానిని మామగారు మందలించారు గూడాను. పాపం చెన్నుడు విశ్వాసంగల సేవకుడు. తమకు రథం కావలెనంటే మామగారికే కబురుచేయండి స్వామీ. అవశ్యం పంపుతారుగదా.

సిద్ధా:- అవును పంపుతారు. పంపకముందే పురవీధులన్నీ కృతకవాతావరణంతో నింపి తదుపరి నాకు రథం పంపుతారు. యశో! నేను చేసిన నేరానికి చెన్నుని శిక్షించనేల?

యశో:- (క్షణకాలం చకితఅయి తిరిగి సంబాళించుకొని) అవును స్వామీ మీకే శిక్ష విధించాలి. బహుశా అందుకే

పిలిపించి వుంటారు మామగారు. రాజ్యపాలనా భారాన్ని మీహస్తగతం చేయటంద్వారా మిమ్మల్ని చక్రవర్తులు శిక్షించి తీరెదరని నా విశ్వాసం. తప్పదు. రేపటినుంచీ తమరు చక్రవర్తులు. గౌతమ సిద్ధార్ధ చక్రవర్తులు సుమా.

సిద్ధా:- (సుదీర్ఘంగా ఆలోచిస్తున్నవాడి మాదిరిగా కనుపిస్తాడు.)

[అదే సమయంలో తెరలోనుంచి మళ్ళీ]

"యువరాజులుంగారు అవశ్యం దయచేయాలి."

అని వెనుకటి పురుషకంఠం వినపడుతుంది. ఆనందంలో పారవశ్యత నొందిన యశోధరను నెమ్మదిగా పాన్పుపై పవళింపజేసి గోముజేసి సిద్ధార్ధుడు నిష్క్రమిస్తాడు. తెర జాలిగా వాలిపోతుంది.

సిద్ధార్ధుని శయ్యాగారం. రాత్రి సమయం. యశోధర ప్రక్కన తనకుమారుడు రాహులుని పెట్టుకొని నిద్ర పోతూ వుంటుంది. సిద్ధార్ధుడు చాలా ఆందోళనాయుతంగా కను పిస్తాడు. కాసేపు ప్రక్క మీద పరుంటాడు అంతలో లేచి కూర్చుంటాడు. అటూ యిటూ పచార్లు చేస్తాడు. బ్రహ్మాండమైన తుఫాను మధ్య కాలంలోని కల్లోలిత సముద్రపుటలల వైఖరి సిద్ధార్ధుని మనస్సు పరిపరివిధాల వూగిసలాడుతూ వుంటుంది. నిశీధ సమయం మాత్రం, నిశ్శబ్దంగా నిగూఢంగా తుఫానుకు ముందుండే ప్రశాంతతను పోలక బోస్తూ ఒక విధమైన గభీరతను మాత్రం సృష్టించింది. సిద్ధార్ధుడు తిరిగి లేచికూర్చుంటాడు. అది మూడవసారి.

సిద్ధార్ధుడు పరస్పర విరుద్ధ భావాల సంఘర్షణలో కొట్టుకు పోతూవుంటాడు. యిచ్చట ప్రదర్శనకు రక్తికట్టే తలంపుతో ఆద్యంతము వరకు తెల్లటి ముసుగుతో కప్పబడ్డ ఆకారం ఒకవైపు నల్లటి ముసుగుతో కప్పబడ్డ ఆకారం మరొక వైపు రంగస్థలంపైకి ప్రవేశింప జేయవచ్చును. అయితే ఆ ఆకారాలు ఏవో మానవాతీత మైన శక్తులేమోనని ప్రేక్షకులు భ్రమింపకుండా, సిద్ధార్ధుని ఆత్మ గతమైన పరస్పర విరుద్ధ భావాలను వ్యక్తం చేయించటమే ఆ ఆకారాలను ప్రవేశ పెట్టిన వుద్దేశ్యమని ప్రదర్శకులు ప్రేక్షకులకు రంగ ప్రారంభంలో, నేపథ్యంనుంచీ తెలియజేసిన చేయవచ్చును.

సిద్ధా:- అబ్బా! యీ సిద్ధార్ధునికిక తరుణోపాయమే లేదా ఏమి. ఈ పరస్పర విరుద్ధ భావ సంఘర్షణలో ఎంత కాలం నలిగిపోవటం. మానవుడట్లా ఆశాపాశా లతో తన్ను తాను బిగించుకొని దుఃఖసాగరంలో కొట్టుకుపోతూవుంటే చూస్తూ వుండడమేనా.

[రంగస్థలంలో ఒక వైపునించీ తెల్లటి ఆకారం ప్రవేశిస్తుంది. ఈ ఆకారం సిద్ధార్ధుణ్ణి బుద్ధమార్గానికి నడిపించాలనే ఆత్మగత మైన ప్రబోధ శక్తిమాత్రమే.]

తె.ఆ:- అశాశ్వతమై, అస్థిరమై, వేదనాభరితమైన యీ రాజ్యకాంక్ష, ఈ సంసారతృష్ణ, ఈ క్షణికానందాలు, వీటితోనే మోసపోయి, నీ జీవితలక్ష్యాన్ని, పరమార్థాన్ని, మరచిపోతున్నావు. కాలము వృధా చేస్తున్నావు. ఆలోచించావా?

[రంగస్థలం పైకి నల్లటి ఆకారం ఒకటి రెండవ వైపునించీ ప్రవేశిస్తుంది. ఇది సిద్ధార్థుని ఆత్మగతమైన తృష్ణను వ్యక్తం చేసే శక్తిమాత్రమే.]

న. ఆ:- నీవు తలపెట్టే విధానం ఆత్మ విధ్వంసక విధానం. నీ సర్వనాశనానికి దారితీస్తుంది. నీ సుఖజీవనానికి స్వస్తివాచకం పాడుకొంటున్నావు. ఆలోచించుకో. నీ ముదుసలి తండ్రిని నీ అనుంగుభార్యను, నీ ప్రియతమ పుత్రుణ్ణి నట్టేట ముంచటం నీకు ధర్మమేనా.

సిద్ధా:- అవును. పాపం, వాళ్ళనుచూస్తే జాలివేస్తుంది.

తె.ఆ:- సిద్ధార్థా! నీకు నీ తండ్రి నీ భార్యా పుత్రాదులను చూస్తేనే జాలివేస్తుందా. మరి నిరంతర ప్రసవ వేదన పొందే యీ అనంత మానవకోటిని చూస్తే జాలి వెయ్యటంలేదా. ఇదేనా నీ జీవకారుణ్య సిద్ధాంతంలోని అంతరార్థం. ఇదేనా నీ అనంత మానవకోటి సేవలోని పరమ రహస్యం. అవునా?

సిద్ధా:- కాదు. నేను యీ సంసార తృష్ణలో యీదులాడను. ఆశాపాశాలతో తన్ను తాను బిగించుకొని సర్వ వ్యధలకు గురి అవుతున్న మానవుణ్ణి విముక్తుణ్ణి చేస్తాను. తరుణోపాయం అన్వేషించుతాను. భార్యా పుత్రాదుల మమకారాన్ని తెంచుకో గలను.

న. ఆ:- తెంచుకోలేక ఏంజేస్తావు. అహర్నిశలు, నీ సౌఖ్యం కోసం కనబడని త్యాగంజేస్తూ నీ మీదనే సర్వాశయాలూ, సమస్త కోర్కెలూ పెట్టుకొన్న నీజనకుడు సౌందర్యరాశియైన నీ పత్ని, నీ అనుంగు పుత్రుడు, వీరిని త్యజించగలవు. కాని సిద్ధార్థా! ఆలోచించుకో. నీ కన్న తండ్రిని, నీ ప్రేమపాత్రురాలైన భార్యనూ సౌఖ్య పెట్టలేని వాడివి నీవు మానవ కల్యాణం కొఱకు పాటుపడగలవంటే నమ్మదగిన సంగతేనా.

సిద్ధా:- అవును. పాపం యశోధరను తలచుకుంటేనే గుండెలు పగిలిపోతున్నవి. అబ్బా! ఏది తరుణోపాయం?

తె.ఆ:- సిద్ధార్థా! తరుణోపాయమే ఏదో తెలియకుండా పోతుందా నీకు. ఆశ్చర్యం. వ్యధామయ జీవితాల నుంచీ విముక్తి ఎట్లా పొందాలో తరుణోపాయం అన్వేషించి సంతత దుఃఖభూయిష్ట మానవకోటికి వెలుగు చూపిన బుద్ధుడు, సిద్ధార్థుడని భవిష్యద్జ్ఞానవాళికి నిన్ను కీర్తించే అవకాశం యివ్వగలిగిన వాడివి నీకే యింకా యీ స్వార్ధము, సంసార తృష్ణ, మమకారం వదల లేదా? ఈమంచు తెరల ముసుగులో ఎన్నాళ్ళు మరుగున పడతావు. లేలెమ్ము. మానవ వ్యధకు కారణ మేమొ గ్రహించి దాని నిర్మూలనకు తరుణోపాయం ఆలోచించు. సంతతానంద మానవ జీవన మార్గానికి ప్రథమ పథికుడవై ప్రబోధ గీతం పాడే వైతాళికుడివి కమ్ము. లేచిరా. ఆలస్యం విషమ పరిణామాలకుదారి తీస్తుంది.

సిద్ధా:- అవును. నేను తప్పక పయనించాలి. మానవ వ్యధా నిర్మూల నానికి బుద్ధ మార్గం అన్వేషించి తీరాలి. అనేక పరిభ్రమణాల పర్యంతం దురాశా ప్రేరిత మైన దుఃఖ సాగరంలో యీదు లాడుతూ అజ్ఞా నాంధకారంలో కొట్టుకు పోతూ మమకార మనే మంచు తెరలతో కప్పబడియున్న మానవ కోటికి తరుణోపాయం చూపాలి.

న. ఆ:- ముందు నిన్ను చుట్టుకొని బ్రతుకుతున్న నీ ఆప్తు లకు తరుణోపాయం ఆలోచించావా సిద్ధార్థా! రాజ్య భారాన్ని వహింప లేని నీ అసమర్థతకు మానవ కళ్యాణం అనే ముసుగు కప్పుతున్నా వేమో ఆలోచించావా?

సిద్ధా:- అది మాత్రం నిజంగాదు. సిద్ధార్థుడు ఆశా పిపాసా ప్రేరితులై దారీ తెన్నూ తెలియక ఆవేదన పొందే యీ మానవాళికి బుద్ధ మార్గాన్ని చూపి తీరుతాడు. రాజ్య భారం వహించ లేని అసమర్థుడు కాడు యీ సిద్ధార్థుడు.

తె.ఆ:- అవును. సిద్ధార్థా! నీవు రాజ్యభారం వహించలేని అసమర్థుడవు మాత్రం కావు. వాస్తవం. వ్యధా మయ మానవాళికి వెలుగు చూపి జ్ఞాన మార్గాన్ని చూపే ధీశాలివి. ఆడంబరం లేని త్యాగం నీది. పయనం సాగించు. విజయాన్ని సాధించు, సిద్ధార్థా.

సిద్ధా:- తప్పక పయనిస్తాను. నేడే పయనిస్తాను.

న.ఆ:- నేడే పయనిస్తావా? అమాయకురాలు, త్యాగశీలి, అయిన ఆ యశోధర ముఖం చూడు. కరుణా సముద్రుడ నందువే నీకు జాలి వెయ్యడం లేదా, ఆ పవిత్ర శీలను, ఆపసి కూనను, నట్టేట ముంచి పోవటానికి?

సిద్ధా:- కాని లోకకళ్యాణం కొరకు తప్పదు. నేను పరిత్యాగం చేయక తప్పదు.

న.ఆ:- పరిత్యాగం పేరుతో నీ చల్లటి సంసారంలో చిచ్చు పెడతా నంటావా? ఆ మహా యిల్లాలి హృదయంలో కుంపటి ముట్టించి పోతా నంటావా? ఇది మాత్రం నీకు ధర్మమా? ఇది మాత్రం నీకు న్యాయమా? నిన్ను కావలెనని కోరి వరించి వచ్చిన ఆ ప్రణయినిని మోసం చేసి పోతావా చెప్పు.

సిద్ధా:- అంతా వాస్థవమే! అబ్బా! కాని నన్ను వక్ర మార్గాన పట్టించకు.

న.ఆ:- వాస్థవము వక్రమార్గమా! అసందర్భం. అటుచూడు ఆముగ్ధ మోహన మూర్తిని ఎంతటి కఠినునికైనా గుండెలు పగిలి పోతవి చూడు. నీకు హృదయం లేదా! చూడు, ఒక్కసారి అటుచూడు.

తె. ఆ:- సిద్ధార్థా భ్రమాలోలుడవు కాబోకు. వేళ మిగిలి పోతుంది. బుద్ధమార్గాన పయనించు. లే. లేచివెళ్లు.

న. ఆ:- నీ ప్రియతమ యశోధరవంక చూడు.

తె. ఆ:- బుద్ధమార్గం కనిపించడంలేదా? అదిగో ప్రస్ఫుటంగా బాట కనిపిస్తూనే ఉంది. పయనించు.

న. ఆ:- సిద్ధార్థా యశోధర.

తె. ఆ.- సిద్ధార్థా బుద్ధమార్గం.

[తెరలో చెన్నుని కంఠధ్వని]

"పాపం ఎవరో దురదృష్టవంతుడు రోగంవచ్చో, కాలంతీరో మరణించాడు ప్రభూ."

[ నీలిమ కంఠధ్వని ]

"ప్రభూ! మహారాజులుంగారి ఆజ్ఞలు తమకు అట్లాంటి పదాలు వినబడ గూడదని."

[ చెన్నుని కంఠధ్వని ]

"ఆరోగ్యవంతంగా సంతోషంలో ఆనందాలో ఊగి పోయే సంఘానికి చీడపురుగులాంటిది ప్రభూ ఆకలి."

తె. ఆ:- బుద్ధమార్గం కనుపించటంలేదా సిద్ధార్థా.

న. ఆ:- నీ ముదుసలి తండ్రి అటుచూడు ఒక్కసారి.

[ చెన్నుని కంఠధ్వని ]

"జవసత్వాలుడిగి కాటికి కాళ్ళు చాచుకొని కేవలం మానవాకారం మాదిరిగా కనుపిస్తున్న వయోవృద్ధు రాలు స్వామీ ఆమె యిప్పుడు."

న. ఆ:- నీ ప్రియతమ యశోధరను చూడు. నీ మీద ఎంతో నమ్మకం పెట్టుకొని నిశ్చింతగా, అమాయికంగా, ఎట్లా నిద్రిస్తుందో. నీవులేని యీ శూన్య ప్రపంచంలో ఆమె ఒక్కక్షణం బ్రతకగలదా పాపం.

తె, ఆ:- సిద్ధార్థా బుద్బుద ప్రాయమైన యీ మానవ జీవితం ఎంతటి తృష్ణలో మునిగి కొట్టుకుపోతుందో యిప్పటి కైనా గ్రహించావా. లే. లేచి వెళ్ళు.

సిద్ధా:- అబ్బా! ఏమిటీ సంఘర్షణ... (చూడలేక తన దక్షిణ హస్తాన్ని ముఖానికి అడ్డం పెట్టుకుంటాడు. క్షణకాలం రంగ స్థలం అంధకారమయ మవుతుంది. ఆకారాలు రెండూ అదృశ్యమవుతాయి. తిరిగి రంగస్థలంపై కాంతి ప్రసరిస్తుంది. పవనవీచికా సంగీతం నేపథ్యంనుంచి వినిపిస్తూంటుంది. సిద్ధా ర్థుడు అది వింటూ ఉత్తేజితుడైనవాని మాదిరిగా కనుపి స్తూంటాడు.)

సిద్ధా:- యశోధరా! నిద్రనించి మేల్కొని నన్ను గానక మోసం జేసి పోయానని నిందించకు సుమా. నీ ప్రణ యత్వంతోనే గాక నీ మాతృత్వంతో గూడ నన్ను పునీతుణ్ణి జేశావమ్మా. నా సంకల్పశిద్ధితో తిరిగి నిన్ను గూడ పునీతురాలను చేసి నా ఋణం తీర్చు కుంటానమ్మా. సెలవు.

(అగ్గంగా నిద్రిస్తున్న యశోధర కురులు సవరించి రాహులకుమా రుని స్పృశించి, శాలువకప్పి ఉద్వేగంగా నిష్క్రమిస్తాడు సిద్ధార్థుడు. పవనవీచికా సంగీతం ఉచ్ఛదశకు వస్తుంది.)

[ తెర పడుతుంది ]



బుద్ధం శరణం గచ్ఛామి,

ధర్మం శరణం గచ్ఛామి,

సంఘం శరణం గచ్ఛామి.

1955 మే మాసంలో బుద్ధ జయంత్యుత్సవ సందర్భంలో

# తెనాలి మునిసిపల్ థియేటర్‌లో

జరిగిన ప్రథమ ప్రదర్శనంలో పాల్గొన్న

## కళాకారులు

సిద్ధార్థుడు : పి. వి. సుబ్బారావు, బి. ఏ., బి. యల్.

యశోధర : కుమారి డి. సభారంజని

నీలిమ : కుమారి పి. రేవతి

చెన్నుడు : యం. గౌరీనాధశాస్త్రి

కుష్టురోగి : పి. ఆర్. కోటేశ్వరరావు
(వి. యస్. ఆర్. కాలేజి)

వృద్ధవనిత : వి. రామకృష్ణశర్మ
(వి. యస్. ఆర్. కాలేజి)

తెల్లఆకారం : వి. ఆర్. కె. యస్.

నల్లఆకారం : వి. శివరామయ్య

నేపథ్యసంగీతం : కుమారి అన్నపూర్ణ, మోహన్‌రావు

పర్యవేక్షణ : యం. సత్యనారాయణ, యం.ఏ.

ఆర్టుడైరెక్టరు : ఎ. హనుమంతరావు,

టేప్‌రికార్డింగ్ : Municipal Broad-Casting System

మేకప్ : హనుమంతరావు, రాజారావు, ఆచారి

దుస్తులు : ఆదిశేషయ్య